...సీ రాజీనామా
—2-వ పేజీ

రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గ సభ
—1-వ పేజీ



# ఆంధ్రపత్రిక.

The Andhra Patrika, Madras. | Regd. No: 1118 | Vol 32. | FRIDAY. | 31st August, 1945. | No. 127. | వెల ఒకఅణా. | Founder : K. Nageswara

# జపానులో అమెరికను సేనల ప్రవేశం

## శరణాగతిపత్రంపై శనివారంనాడు సంతకాలు

## మిత్రపారాషూట్ బలాలు రాజమందిరాన్ని ఆక్రమించినవి

### జనరల్ మెక్ఆర్థర్ కూడా ఒకవిమానంలో జపాను చేరాడు

సాన్‌ఫ్రాంసిస్కో, ఆగస్టు 29: విమానాలమీదపోయెడి అమెరికను వైమానికసైన్యం తాలూకు పదకొండవ డివిజను సేన నేడు జపానులోని అట్సుగి విమానాశ్రయంలో దిగుచున్నది.

లండను, ఆగస్టు 30: జపాను చక్రవర్తియొక్క వేసంగిమకాము అయిన రాజమందిరమును నేడు అమెరికనుసేనలు ఆక్రమించినవి. అట్సుగి విమానాశ్రయంలో దిగిన అమెరికను విమానాలనుండి కొలది గంటలలోనే 6 వేల సైనికులు దింపబడిరి. సూర్యోదయం అయ్యేసరికి విమానాలన్నింటినుండియు దిగవలసిన సైనికులు దిగారు. అప్పటికి ఇంకా 4 విమానాల్లోనుంచి మాత్రమే ఇంకా సైనికులు దిగవలసియుండిరి. 3 నిమిషాల కొక్కొక్క విమానం ఖాళీచేసి సైనికులు దిగారు. విమానాశ్రయంలో దిగినసేన సరాసరి 25 మైళ్లు ముందుకు ప్రయాణం చేసి, సరాసరి జపాను చక్రవర్తితాలూకు వేసంగి మకాము అగు రాజమందిరమును ఆక్రమించెను. ఈ రాజమందిరములోనే మాకార్థరు గారి కార్యాలయము ఏర్పాటు చేయబడుచున్నది.

సైన్యమును తీసికొని పోయేటటువంటి బ్రహ్మాండమైన 200 విమానములు అమెరికన్ కాల్బల సైన్యమును భర్తీగా ఎక్కించుకొని ఓకినావా దీవినుండి, బయలుదేరినట్లుగా ఇంతకుపూర్వము ఓకినావానుండి వార్తవచ్చినది. ఈ సైన్యమే జపాను ముఖ్యపట్టణమైన టోకియోనగరాన్ని ఆక్రమించుకొనును.

ఈ విమానములలోనే ఒకదానిలో పసిఫిక్కు రంగ మిత్రమండలి సర్వసేనాని యగు జనరల్ డగ్లస్ మెకార్థరుగారు ఉన్నారు.

**టోకియోనగరంలో తెల్లజెండాలు**

టోకియోనగరంలో తెల్లజెండాలు ఎగురుతున్నాయి. జపానును ఆక్రమించుటకై వచ్చిన మిత్రసేనల యెడల జపాను వారు చాలా మర్యాదగా వినయవిధేయతలతో ప్రవర్తిస్తున్నారు. జపానును ఆక్రమించుటకు ఆరుమాసాలలో 5 లక్షల మిత్రసేన దింపబడునని తెలియుచున్నది.

**సెప్టెంబరు 1 వ తేది శరణాగతి పత్రంమీద సంతకాలు**

శనివారంనాడు జపానువారు వ్యవహార లాంఛనంగా తమ శరణాగతి పత్రముపై సంతకముచేసి జనరల్ మెకార్థరుగారికి సమర్పిస్తారు. జనరలు మెకార్థరుగారు నేడు ఆగస్టు 30 తేదీ గురువారం ఇండియన్ స్టాండర్డు టైము ప్రకారంగా సాయంత్రం 4-30 గంటలకు జపానులో అట్సుగి విమానాశ్రయంలో దిగుతారని న్యూయార్కు రేడియో నేడు ప్రకటించినది. వారు అక్కడదిగుటకు పూర్వమే నావల మీద వచ్చిన బ్రిటిషుసేనలు, అమెరికను సేనలు నేటిరాత్రి (గురువారంరాత్రి) జపానులో ముందుగాదిగును. టోకియో సముద్రశాఖలో చేరియున్న బ్రిటిషు అమెరికను నావలనుండి సేనలు గురువారం తెల్లవారుజామున ఇండియన్ స్టాండర్డుటైము ప్రకారంగా 3-45 గంటలనుండియు జపానురేవులో దిగుటకు ఆరంభించును.

పసిఫిక్కు సముద్రరంగంలోని మిత్రమండలి నౌకాదళ సర్వసేనాధిపతియగు అడ్మిరలు చెస్టరు నిమిజ్ గారు టోకియో సముద్రశాఖలోనికి సముద్రవిమానముమీద నేడువచ్చారు. వెంటనే "సౌత్ డకోటా" అనెడి అమెరికను యుద్ధనావమీదకువెళ్లిరి. అమెరికను నావలను బ్రిటిషు నావలను టోకియోసముద్రములోనికి నడిపించుకొని పోవుటకై వచ్చిన జపాను పైలట్లు రేవు మార్గదర్శకులు చాలా నిస్సత్తువగా, ఆకలిబాధకు కృశించినవారివలెఉన్నారు.

జపానులోని అట్సుగి విమానాశ్రయంలో అమెరికను వైమానికసైన్యంతాలూకు 11 వ డివిజను నేడు గురువారం టోకియో టైంప్రకారంగా ఉ|| 6 గం||ల నుండియు దిగుట ప్రారంభించినది. అదేసమయంలో యొకోసుకా నౌకాశ్రయంలో 400 బ్రిటి

2-వ పేజీ చూడుడు.

### జర్మనీ యుద్ధనష్ట పరిహారం 1948 ఫిబ్రవరి 15 వ తేదీ లోపుగా చెల్లించాలి

ఫ్రాంక్‌ఫర్ట్, ఆగస్టు 29: మిత్రరాజ్యాలకు జర్మనీ యుద్ధనష్ట పరిహారం 1948 ఫిబ్రవరి 15 వ తేదీ లోపుగా చెల్లించవలెనని నిర్ణయించారు.

యుద్ధనష్ట పరిహారశాఖ డైరెక్టర్ జెఫర్సన్ ఈ విషయాన్ని నేడు ప్రకటించాడు.

### కార్యవర్గ సమావేశం సెప్టెంబర్ 12 ననే

రాష్ట్రపతి నిర్ణయం

శ్రీనగర్, ఆగస్టు 29: కొన్ని ప్రధాన విషయాలను అత్యవసరంగా ఆలోచించే నిమిత్తం కాంగ్రెసు కార్యవర్గ సమావేశం సెప్టెంబరు 12 ననే బొంబాయిలో జరగవలసి వున్నదని రాష్ట్రపతి మౌలానా ఆజాద్ నిర్ణయించారు. ఈ సమావేశం సెప్టెంబరు 22 న జరుగుతుందని ఇది వరలో ప్రకటితమైనది.

బొంబాయిలోని మిత్రులను సంప్రతించి ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని కూడా సెప్టెంబర్ 15 ననో, 21 ననో జరపడానికి నిశ్చయించవలసినదని రాష్ట్రపతి, కార్యదర్శి కృపలానికి కబురుచేశారు.

### బొంబయిలో ఘోర అగ్నిప్రమాదం

### 14 గురి మరణం

బొంబాయి, ఆగస్టు 30: బొంబాయిలో నిన్నమధ్యాహ్నం, 3 గంటలకు 5 నిమిషాలు ఉండగా పెద్ద అగ్నిప్రమాదం జరిగింది. ఏనుమందుగుండు ప్రమాదం తటస్థించినచోట, ఆరుగురు ఆస్పత్రిలోనూ మొత్తం 14 మంది మరణించారు. 13 మంది ఒళ్లంతా తీవ్రంగా కాలి ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. కొన్నిలక్షల రూపాయల నష్టం కలిగింది. ఇంతమంది మరణానికి కారణమైన ఇంతటి ఘోరప్రమాదం ఈమధ్య ఎన్నడూ జరగలేదని అనుకొంటున్నారు.

బలార్డ్ ఎస్టేట్‌లో పారమౌంట్ పిక్చర్స్‌వారి ఆఫీసుఉన్న హేగ్ భవనంలో ఈప్రమాదం తటస్థించింది. ఈభవనం పక్కనే అమెరికా సైనిక ప్రధానకార్యాలయం ఉన్నది.

మంటలురేగిన కొద్దిసేపట్లోనే మంటలార్పు దళాలూ, పోలీసు ముఠాలూ ఆ ప్రదేశానికి వచ్చాయి. మంటల నార్పటంలో అమెరికా సైనికులుకూడా తోడ్పడ్డారు. మంటల నార్పటానికి 4 గంటలు పట్టింది. మంటలు ఒకగంటసేపు జ్వాలలుగా ఎగశాయి. పారమౌంట్ పిక్చర్స్ ఆఫీసులోని ప్రతిసామానూ కాలి బొగ్గయి పోయింది.

పారమౌంట్‌పిక్చర్స్ మేనేజర్ గంగూలీ, పైపుచేసే యూరోపియన్ ఆడపిల్లలు ఇద్దరు మంటకు ఆహుతి అయిపోయారు.

## 'భారతదేశ స్వాతంత్ర్యంకోసం భారతీయులే పోరాడాలి'

### 'యథార్థవిషయాలను అమెరికనులు తెలుసుకొంటే చాలు'

**అమెరికాదేశీయునిప్రశ్న : గాంధిజీ సమాధానం**

బొంబాయి, ఆగస్టు 29: ఎమాన్యుయల్ కెలర్ అనేఆయన గాంధిమహాత్ముడికి "బాంబే క్రానికల్" పత్రికద్వారా తెలియజేసినాడు.

"నేను యునైటెడ్ స్టేట్సు కాంగ్రెసు ప్రతినిధిని. భారత దేశ సత్వరస్వాతంత్ర్య ప్రాప్తికి యునైటెడ్ స్టేట్సు ఏవిధముగా సాయపడగలదో తెలియజేయవలసిందని వినమ్రులను భక్తిశ్రద్ధలతో అడుగుతున్నాను. బ్రిటీషుపద్ధతిలో మార్పును తీసుకొని రావడానికి మేము ఏమిచేయవలెను? భారతీయాశయాలను విశ్వసిస్తున్న అమెరికనులము మేము భారతదేశానికి సాయము చేయవలెనని ఎంతో ఆశపడుతున్నాము. మాకు దారి చెప్పవలసింది. మీ వర్తమానముకోసము ఎదురుచూస్తున్నాము. భారతీయ పోరాటాన్ని గురించి, భారతీయుల ఆశయాలనుగురించి ఇంకా ఎక్కువగా తెలుసుకొని పాటుపడగలము."

ఈ వర్తమానానికి గాంధీమహాత్ముడు "బాంబే క్రానికల్" పత్రికద్వారా కెలర్‌కు ఈ విధముగా తెలియజేసినాడు:

"ఎమాన్యుయల్ కెలర్ వేసిన ప్రశ్నకు జవాబుచెప్పడము నా కిష్టములేదు. కాని మర్యాదకోసము సమాధానము చెప్పవలెను. భారతదేశపు ధనము ఎంతో ఖర్చుచేసి బ్రిటీషువారు భారతదేశాన్ని గురించి అనేక అసత్యాలను అమెరికాలో ప్రచారము చేస్తున్నారు. ఆప్రచారాన్ని నమ్మకుండా భారతదేశాన్ని గురించిన యథార్థవిషయాలను అమెరికావారు తెలుసుకొంటేచాలును. అమెరికావారు ఆ పోరాటములోనుంచి తొలగవలెను. భారతదేశ స్వాతంత్ర్యముకోసము భారతదేశమే పోరాడవలెను. అహింసాయుత పోరాటానికి భారతదేశము సిద్ధమవుతున్నది.

### రాష్ట్రకాంగ్రెసు కార్యసంఘ సమావేశము

**గుంటూరుకు ఆహ్వానము**

గుంటూరు, ఆగస్టు 27: పట్టణకాంగ్రెసు కార్యసంఘం నిన్న సాయంత్రం చావలి సూర్యనారాయణ గారి అధ్యక్షతన మొదటిసారి సమావేశమైనపుడు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యసంఘ సమావేశం గుంటూరులో ఏర్పాటు చేయవలసినదిగ రాష్ట్ర సంఘాధ్యక్షుడు ప్రకాశంగారిని కోరుతూ తీర్మానించారు.

శ్రీ అనసూయ త్రిపురసుందర రావుగారి అకాలమృతికిని, సుభాశ్చంద్ర బోసు దుర్మరణానికిని సంతాప తీర్మానాలు చేశారు.

రాజధానిలోని డిటిన్యూలందరను విడుదలచేయగోరారు.

## 'జాతిద్వయసిద్ధాంతం సంక్షోభానికి దారితీస్తుంది'

### స్వయంనిర్ణయసూత్రంపై నెహ్రూప్రకటన

### 'ఎన్నికలలో కాంగ్రెస్ నిండుబలంతో పోటీచేస్తుంది'

న్యూఢిల్లీ, ఆగస్టు 29: పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నేడు న్యూఢిల్లీ జర్నలిస్టులతో చేసిన ప్రసంగంలో, భారత కమ్యూనిస్టులు, కాంగ్రెసు, ఆటంబాంబు, పాకిస్తాన్, ఎన్నికలు మొదలైన వివిధ విషయముల గూర్చిన అనేక ప్రశ్నలకు సమాధాన మిచ్చారు. ఎన్నికల విషయమై పండిట్ నెహ్రూ ఇలా అన్నాడు: "కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము ఈ సమస్యను అన్నివైపులనుంచి పరికించవలసియుంటుంది. ఎన్నికల విషయమై కాంగ్రెసు అవలంబించే వైఖరికీ ఇతరుల వైఖరికీ భేదమున్నది. స్వతః సిద్ధంగా ఎన్నికలు ప్రధానమైనవే; కాని సందర్భానుసారంగా, ప్రస్తుత పరిస్థితులను పురస్కరించుకొనియే కాంగ్రెసు ఈ విషయమై తన అభిప్రాయము నేర్పరుచుకోవాలి. కాంగ్రెసు ఏస్థానాలకు పోటీచేస్తుందో నేను చెప్పలేను; కాని 'నిండుబలం'తో పోటీచేస్తుందనే ఊహిస్తున్నాను. ఎన్నికలలో శ్రేష్ఠులే పోటీ చెయ్యాలని కాంగ్రెసు అభిప్రాయము. ఎన్నికలు కాంగ్రెసు నిత్యవ్యవహారాలను స్వల్పంగా వ్యస్తం చేయవచ్చును."

ప్రత్యేక అనుమతి పొందితేనే కాని, కాంగ్రెసుసంస్థయొక్క కార్యనిర్వాహక పదవులలో నున్నవారు ఎన్నికలలో పోటీచెయ్యకూడదని నెహ్రూగారు సూచించారు. రాష్ట్రాలలో కాంగ్రెసుపదవీ స్వీకారమునకు తమ వ్యతిరేకతను తెలుపుతూ బొంబేరాష్ట్ర ముస్లింలీగు చేసిన తీర్మానమునుగూర్చి ప్రశ్నింపగా నెహ్రూ ఇలా అన్నాడు: "రాష్ట్రాలలో అధికారం స్వీకరించే ప్రశ్న ఇంకా రాలేదు. అపరిస్థితులువచ్చినప్పుడు, కాంగ్రెసునీతీర్మానము ఎక్కువ బాధించజాలదు. సందర్భానుసారంగా కర్తవ్యం నిర్ణయించుకోవలసి ఉంటుంది." కమ్యూనిస్టులగూర్చి పండిట్ నెహ్రూ ఇలా అన్నాడు: "కాంగ్రెసుకు సంబంధించినంతవరకు, కమ్యూనిస్టుపక్షవిషయమై కార్యనిర్వాహకవర్గము పర్యాలోచన జరుపుతుంది. కాంగ్రెసు ఇంతవరకు రెండు అంశాల మిశ్రణము. కాంగ్రెసు ఒక ఉద్యమము; శాసనసభలలోనూ ఇతరత్రాను పనిచేస్తున్న ఒక రాజకీయ పక్షము. ఉద్యమంలో పాల్గొనే సభ్యులందరూ ఒకేవైపున నడువవలసి ఉంటుంది. కాని దీనికి అంతరాయం కల్పించినప్పుడు క్లిష్టపరిస్థితులు ఉద్భవిస్తవి. కమ్యూనిస్టు పక్షము యెడ కాంగ్రెసు అవలంబించవలసిన వైఖరిలో రష్యా ప్రసక్తి కాని కమ్యూనిజమ్ ప్రసక్తికాని లేదు. ఇది కేవలము గృహరాజకీయాలకు సంబంధించిన సమస్య; గృహరాజకీయాల విషయమై కాంగ్రెసుకు కమ్యూనిస్టుపార్టీకి భేదాభిప్రాయాలున్నవి. అందుచేతనే కాంగ్రెసు రాజకీయ నీతితో ఏకీభవించని వారిని కార్యనిర్వాహక పదవులకు నియమించడము సమంజసము ని ప్రతిపాదితమైనది.

ఎన్నిక ప్రణాళికలో రాజకీయ, ఆర్థిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యలన్నింటినీ కాంగ్రెసు పరిశీలిస్తుందని అను

2 వ పేజీ చూడుడు

### మాడాం చాంకెషేక్ త్వరలో చైనాకు బయలుదేరి వెళ్లును

వాషింగ్టను, ఆగస్టు 29: చాలాత్వరలో తాను చైనాకు బయలుదేరి వెళ్లుచుండెనని మాడాం చాంకెషేక్ నేడు ప్రకటించెను. శ్వేతభవనములో ప్రెసిడెంటు ట్రూమనును దర్శించి కొద్దికాలం సంభాషించినమీదటను, అమెరికా ప్రధాన సైన్యాధికారి జనరల్ మార్షలుతో సంప్రదించిన మీదటను ఆమె పై విధముగా ప్రకటించెను.

యుద్ధమువల్ల బీభత్సమైన చైనాకు నిరంతరంగాను, తీవ్రంగాను సేవచేయుటవల్ల కలిగిన నాడీ సంబంధమగు వ్యాధుల చికిత్సకై ఆమె యిటకు వచ్చియుండెను. కొన్ని మాసములనుండి న్యూయార్కు పరిసరమునుండి ఆరోగ్యం కోలుకొన్నమీదట ఆమె చుంకింగులో భర్తను కలిసికొని, చైనాప్రజల సాంఘిక క్షేమము కై మరల పనిసాగింప సిద్ధముగానున్నది.

## ముస్లిములు పాకిస్థాన్ కోరకుండా లారెన్స్, వేవెల్ ప్రయత్నిస్తారా?

లండన్, ఆగస్టు 29: 'ముస్లిముల పాకిస్థాన్ కోరికతో భారతదేశసమస్య మరింత గందరగోళమైంది. హిందువుల ఆధిపత్యం విషయమై ముస్లిములకు భయం లేకుండా చేసేందుకు లార్డ్ లారెన్స్ లార్డ్ వేవెల్ ఒక మార్గాంతరం సూచించి, పాకిస్థాన్ కోరికలేకుండా చేయడానికి ప్రయత్నించవచ్చు. దురదృష్టవశాత్తూ అటువంటి మార్గాంతరం కనపడేఆశ ఆట్టే లేదు.' అని ఎడింబరోనుంచి వెలువడే 'స్కాట్స్‌మన్' అనే పత్రిక సంపాదకీయం వ్రాసింది. ఈ పత్రికకన్సర్వేటివులది.

వేవెల్ సంభాషణలను అందరూ చాలా శ్రద్ధతో గమనిస్తున్నారు. కాని సరైనవార్త ఏమీలేనందున ఎవరూ వ్యాఖ్యలు చేయడంలేదు.

### వేవెల్ పరిచయం

ఇండియా ఆఫీస్ సంగతి సందర్భాలు వైకౌంట్ వేవెల్‌కు తెలిసినంత బాగా ఆట్టేమంది వైస్రాయిలకు తెలిసి ఉండవనీ, వేవెల్ ఇప్పుడు నిత్యం ఆ ఆఫీసుకు వెడుతూనే ఉన్నాడనీ 'డెయిలీ టెలిగ్రాఫ్'లో పీటర్‌బరో అనే అతడు వ్రాశాడు.

లార్డ్ లిన్‌లిత్‌గో ఇంటికి తిరిగి రావడానికి కొన్ని వారాల క్రితం లార్డ్ వేవెల్ లండన్‌లో పనిపాటులు చూసుకొంటూ ఉన్నాడనీ, అప్పట్లో వేవెల్ సర్వసైన్యాధిపతి హోదాలోనే ఉన్నప్పటికీ, ప్రతిరోజూ పొద్దున్నప్పుడు ఇండియాఆఫీసుకు వెడుతూ ఉండేవాడనీ అతడు వ్రాశాడు. ఆ రోజులలో ఇండియా ఆఫీసులోనివారు ఈసారి వైస్రాయ్‌గా వెళ్లేవారెవరో తెలుసుకోవాలని చూస్తు ఉండేవారట. లార్డ్ వేవెలే వైస్రాయ్‌గా వెడతాడేమోనని అప్పుడు వారెవ్వరికీ తట్టలేదట.

ఈసారి వేవెల్ లండన్లో ఆట్టే రోజులు ఉండడనీ, క్రొత్త ప్రతిపాదనలు సాధ్యమైనంతవరకూ గజిబిజి లేకుండా సూటిగా ఉండాలని ఆయన అభిప్రాయమనీ, ఈ సందర్భంలో ఆయన వెనుక లార్డ్ మింటో పనిచేసినట్లు చేస్తున్నాడనీ పీటర్‌బరో వ్రాశాడు.

### హెస్. విచారణ

లండన్, ఆగస్టు 25: యుద్ధనేరంవిచారణకై రుడాల్ఫ్ హెస్సును న్యూరెంబర్గుకు పంపిస్తారని తెలియుచున్నది.

## లొంగుబాటుకు సింగపూర్‌లోని జపాన్ సేనాని ప్రాతికూల్యం

### చివరవరకు పోరాడాలనే సంకల్పం

రంగూను, ఆగస్టు 30: సింగపూర్‌లోని జపాన్ సేనాని ఇటగాకి తనసేనలు మిత్రసేనలపై యుద్ధం సాగించాలనే స్థిరంగా సంకల్పించుకున్నవని తనపై అధికారి అయిన ఫీల్డుమార్షల్ కౌంట్ టెరాషీకి కబురుజేశాడని తెలుస్తున్నది. చక్రవర్తి జారీచేసిన లొంగుబాటు ఉత్తర్వును తాము ధిక్కరించబోతున్నారట. జపానుసేనలు ఓడిపోలేదనే తన అభిప్రాయమనీ, అందువల్ల బొందిలోప్రాణాలు వుండేవరకూ పోరాడవలసిందేననీ ఇటగాకి టెరాషీకి తెలియజేశాడు.

### ఇటగాకి తొలగింపుకు మిత్రరాజ్య చర్యలు

న్యూయార్కు, ఆగస్టు 29: సింగపూర్‌లోని జపాన్ సేనాని ఇటగాకిని తొలగించడానికి మిత్రరాజ్యాలు తీవ్రమైన చర్య తీసుకోబోతున్నవని రంగూనునుంచి ఇక్కడికి వచ్చినవార్త తెలుపుతున్నది.

మార్షల్ టెరాషీ లొంగిపోవలసిందని ఆజ్ఞాపించినప్పటికీఇటగాకినిరాకరించాడు. ఇంకా ప్రతిఘటన సాగించడం జపాను సైన్యానికే అవమానమని టెరాషీ ఇటగాకికి హెచ్చరించాడు.

### వెయిన్‌రైట్‌కు ఆహ్వానం

మనిలా, అగస్టు 28: జపాను లొంగుబాటు కార్యక్రమంలో పాల్గొనడానికి కారిగడార్ దీవిలో యుద్ధం సాగించినలెఫ్టినెంట్ జనరల్ జొనాథన్ వెయిన్‌రైట్‌ను కూడా జనరల్ మెక్‌ఆర్థర్ ఆహ్వానించాడు.

### డిసెంబరు 1-వ తేదీనుంచి

న్యూఢిల్లీ, ఆగస్టు 29: భారతదేశ రక్షణకై తయారుచేసిన ప్రత్యేక దళాలకు 1945 డిసెంబరు 1-వ తేదీన ఉద్వాసన చెప్పడానికి ఇండియా ప్రభుత్వం నిర్ణయించుకున్నది. శత్రు విమాన దాడులు జరగవచ్చుననే భయంకొద్దీ ఈ ప్రత్యేక దళాలను రైల్వే, పోస్టల్, టెలిగ్రాఫిక్, డాకు ఉద్యోగాలనుంచి తయారుచేశారు.

## 'జపాన్ జాతీయప్రతిష్ఠ నిలవాలంటే మిత్రరాజ్య షరతులను శిరసావహించాలి'

### పత్రికాగోష్ఠిలో జపాన్ ప్రధాని ప్రకటన

లండన్. ఆగస్టు 29: జపాన్ జాతీయప్రతిష్ఠను నిలుపుకోవాలంటేనూ, జాతీయ విధానాన్ని సంరక్షించుకోవాలంటేనూ చక్రవర్తి ప్రకటించిన ప్రకారం మిత్రరాజ్యాలవారు విధించే అన్నిషరతులకూ అనుగుణంగా లొంగిపోవడమే ఏకైక మార్గం' అని జపాన్ ప్రధాని నరూనాగి హిగాషికూనీ ఇవ్వాళ తాను పత్రికల వారితో జరిపిన గోష్ఠిలో ప్రసంగించాడని జపాన్‌వార్తాసంస్థ ప్రకటించింది.

జపాన్ ప్రధాని పత్రికల వారితో గోష్ఠి జరపడం ఇదే మొదలు.

ప్రధానమైన జాతీయ వ్యవహారాల విషయంలో తన స్వంత అభిప్రాయాలనూ, దృక్పథాలనూ నిర్భయంగా వెల్లడిచేయడం ద్వారా వాక్స్వాతంత్ర్యం విషయంలో తానే స్వయంగా ఒక మార్గం చూపుతాననికూడా ఆయనన్నాడట.

జపాన్ ఓటమికి కారణమేమిటని అడగా ఆయన ఇట్లా అన్నాడు. జపాను పోరాటశక్తి విలుప్తమైపోయింది. అందు కనే ఓటమి సంభవించింది. అమెరికా ఆటంబాంబును ప్రయోగించడం, రష్యా యుద్ధంలో దిగడం మిగతా కారణాలు.

యుద్ధకాలంలో ఎన్నో నిర్బంధాలు అమలుకావడంవల్ల ప్రజలు శృంఖలబద్ధులై వారంతట వారు ఏమీ చేయలేక పోవడం ఓటమికి మరొక ముఖ్యకారణం.

ప్రభుత్వమూ, సైనికాధికారులూ కూడా దేశం ఓడిపోవడానికి దారితీసే పద్ధతులే అవలంబించారు. అదట్లా ఉండగా ప్రజల నిబ్బరం తరిగిపోయింది.

దేశం యావత్తూ ఇదివరకు చేసిన తప్పులను చింతించి, పశ్చాత్తాపపడడం అవసరం అని నా అభిప్రాయం.

దేశస్థులందరూ వ్యవసాయం దినకు దృష్టి మళ్ళించాలని, యంత్రాంగంలో పరఫరా లోపాలను తొలగించాలని ఆయన హెచ్చరించాడు.

## గంటల పంచాంగం

పార్థివసం॥ శ్రావణ బ॥ నవమి
1945 సం॥ఆగస్టు 31 శుక్రవారం
శు॥ న శా 10-13 రా ఉ. 6-55 మృగ తె 5-37 వర్జ్యం ప 12-13 ము 1-44 క.
బ॥ దశమి సెప్టెంబరు 1 శనివారం
శ॥ న శా 8-36 (ఆర్ద్ర) తె 4-48 వర్జ్యం ప 1-42 ము 3-15 క.


# ఆంధ్రపత్రిక

పార్థివసం॥ శ్రావణ బ॥ నవమి
శుక్రవారము


## ఆర్థిక సంప్రతింపులు

రాజప్రతినిధి వేవెలు ప్రభువు లండను సంప్రతింపులలో రాజకీయములతో బాటు ఆర్థికవిషయములు కూడ చర్చకు రానున్నవని వార్తలు తెలుపుచున్నవి. వేవెలుప్రభువు లండను చేరిన సమయములోనే అమెరికా బ్రిటనుకు అరువుకవులు సప్లయి నిలుపుదలచేయుట జరిగినది. అమెరికాతో ఈ సందర్భమున తగిన ఒడంబడిక జరుగని పక్షములో, బ్రిటను సామ్రాజ్యమూలకముగాగల అవకాశములను ఇప్పటికన్న తీవ్రోత్సాహముతో వినియోగించుకొనవలసియున్నదని బ్రిటిషుపత్రికలు హెచ్చరిక చేయుచున్నవి. "బ్రిటను ప్రతి ఎత్తు వేయగల"దని లేబరుపక్షపత్రిక డెయిలీహెరాల్డు గర్జించుటకు ఇదే కారణము. స్టర్లింగు దేశములన్నియూ ఒక్కటిగా వ్యవహరించవలసియున్నదని డెయిలీ మెయిల్ పత్రిక వ్రాయుచున్నది. ఈ సంబంధమైన చర్చలు అపుడే సాగుచున్నవని కూడ తెలియుచున్నది.

"జపానుయుద్ధము అకస్మాత్తుగ ముగియుటవల్ల భారత ఆర్థిక, రాజకీయ భవిష్యత్తు ప్రాముఖ్యతకు రానున్నది. యుద్ధావసరముల ననుసరించి పనిచేయుచున్న ఆదేశ పరిశ్రమలను, శాంతిపరిస్థితి ఉత్పత్తికి అనుగుణముగా మార్చుటలో, అనేక అవసర సమస్యలు రానున్నవి." అని లండనుటైమ్సు పార్లమెంటరీ విలేఖరి వ్రాయుచున్నాడు.

అయితే ఈ శాంతి పరిస్థితికి అనుగుణముగా భారతపరిశ్రమలను నిర్మించుటకు భారతీయులకు అవకాశములుండునా అన్నదే అనుమానాస్పదముగా యున్నది. శాంతిస్థితి అనగా యుద్ధము ముగియుట మాత్రమే కాదు. దానికి తగిన ఆర్థిక పథకములు కూడ నిర్మింప అవసరమున్నది. అందువల్లనే ప్రతిదేశములోనూ, ఆర్థికవేత్తలు పథకనిర్మాణములను గూర్చి ప్రసంగించుచున్నారు. కాబట్టి, భారతశాంతి పరిస్థితి పరిశ్రమల గురించి, ఆర్థిక సమస్యలనుగురించి, ప్రసక్తి వచ్చినపుడు మిగత దేశములు ఏదృష్టితో పథకములు నిర్మించుచున్నవో భారతదేశ పథకములు కూడ అదే దృష్టితో అదే ఆశయములతో నిర్మింపబడవలసియున్నది. కాని భారత అస్వతంత్రస్థితి దానికడ్డు తగులుచున్నది.

యుద్ధకారణముగా బ్రిటను పూర్వ ఆర్థికబలాధిక్యత తొలగిపోయి ఋణగ్రస్తదేశమైపోయినది. అదివరకు బాకీదారుగనున్న భారతదేశము, నేడు పెట్టుబడి దారుగ మారినది. యుద్ధసరఫరాలు చేయుట మూలమున భారతదేశమునకు బ్రిటను, అమెరికాలలో వారి వారి చలామణి నాణెములలో నిలువలేర్పడినవి. ఈ నిలువలను పురస్కరించుకొని, తన పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన యంత్రసామగ్రిని కొనుక్కొనదలచినది. కాని వాటిని సరఫరాచేయుస్థితిలో బ్రిటను లేదు. అమెరికాలో కొనుటకు అవసరమైన డాలరుధనమును ఇవ్వవలసినదనిన దానికిసీ ఇచ్చగించుటలేదు. తాను సప్లయి చేయగల వస్తువులను పుచ్చుకొని తృప్తి చెందవలసినదని బ్రిటను అభిప్రాయమైనట్లు దీనివల్ల వ్యక్తమవుతున్నది. భారతపరిశ్రమలలో బ్రిటనుకు భాగమిచ్చిన భారతీయుల కోర్కెకు సుముఖముగ నుండునట్లు సూచనలు చేయబడినవి. ఈ మధ్య అమెరికాలో భారతపారిశ్రామిక ప్రముఖుల పర్యటన ప్రత్యేక ఫలితములనేమీసాధించలేదు. తమకుతామే భారతదేశములో పరిశ్రమలు స్థాపించు ఇచ్చను కొందరు అమెరికనులు చూపిరి. కొందరు బ్రిటనుతో పోటీ చేసి బ్రిటనుకు కష్టము కలుగజేయవలెననుతలపు లేదనిరి. దీనికితోడుగ అప్పటికి జపానుయుద్ధం ముగియక, అమెరికను పరిశ్రమలన్నియు యుద్ధావసర ఉత్పత్తియందు నిమగ్నమై యున్నవి. కాని కొంతమంది మాత్రము భారత పరిశ్రమవృద్ధికి తోడ్పడ సుముఖులుగనుండిరి. బ్రిటను, భారతదేశమునకు గల డాలరు జమను భారతీయులకు విడుదలచేయవలెనని సూచించిరి.

ఇపుడు జపాను యుద్ధము ముగిసినది కాబట్టి, అమెరికాకు తన విదేశ వ్యాపారమును ఇనుమడింపజేసికొను అభిలాష హెచ్చుటస్వాభావికము. అరువుకవులు సరఫరాలు నిలుపుదలవుట వలన బ్రిటను ప్రతీకారపద్ధతిగ సామ్రాజ్యదేశములలో అమెరికావాణిజ్యమునకు ప్రవేశములేకుండ చేయవచ్చును. దీనితోబాటు భారతదేశమునకు గల డాలరునిలువలను తన ప్రయోజనములకే బ్రిటను వినియోగించుకొను ప్రమాదము కూడ లేకపోలేదు.

ఈ విధానము అవలంబించి నైతికముగా దానిని సమర్థించుకొనుటకు, సామ్రాజ్యదేశముల సృహృద్భావము అంగీకారం అవసరమై యున్నవి. అంతర్జాతీయ పరిస్థితులే గాక, పైన చెప్పిన ఆర్థిక సదుపాయముల సాధనకు కూడ, భారత రాజకీయ సమస్యను కొంతవరకు పరిష్కరింప తలపెట్టరని ప్రాజ్ఞులనుకొనిరి. బహుశః ఈ అభిప్రాయమును సందేహించ నవసరము లేదేమో ?

అయితే తన భవిష్యదార్థిక పారిశ్రామిక అభివృద్ధికి, భంగము కలిగే ఏ ఏర్పాటులను రాజకీయ సదుపాయముల కొరకు భారతదేశ మంగీకరింపజాలదు. రాజకీయ స్వాతంత్ర్యము ఆర్థిక స్వాతంత్ర్యమునకు, అభివృద్ధికి సాధన. పరస్పరాను బంధముగల ఈ రెంటిలో ఒకటిని రెండవ దానినుండి విడదీయుట అస్వాభావికము. ఇపుడు తెలియవచ్చినట్లు భారతదేశ ఆర్థిక విషయములు కూడ వేవెలుప్రభువుతో చర్చించిన వాటి పరిష్కారము మాత్రము ముందు ఏర్పడబోవు జాతీయప్రభుత్వమునకే వదలవలసియున్నది. అంతేగాక ఇతరదేశములతోగాని, సామ్రాజ్యాంతర్భాగదేశములతోగాని ఏవిధమైన వర్తకఒడంబడికలు జరుపుకొనుటకు ఇప్పటి భారత ప్రభుత్వమునకు ప్రాతినిధ్యములేదు.

## పాకిస్థాను విషయమై నిర్దిష్ట ప్రకటన కోరాలి
### జాతీయ మహమ్మదీయులకు అసఫాలీ ఉద్బోధ

శ్రీనగర్, ఆగస్టు 28: పాకిస్థాను సమస్యలో మహమ్మదీయ జాతీయవాదుల దృక్పథమును ప్రతిఫలింపజేయుచున్న అసఫాలీగారు, కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు, ఈక్రింది ప్రకటన గావించుచున్నారు: ఎన్నికల ప్రచారము సాగిన కొలది పాకిస్థాను వివాద ప్రబలతరమగును. భారత మహమ్మదీయులు కేవలను సూత్రుల వల్ల తమ పంథాను నిర్ణయించుకొనక, పాకిస్థాను వాదులనుండి ఈక్రింది విషయములపై నిశ్చితమును, వివరమును అను ప్రకటన కోరవలెను. (1) పాకిస్థాను ప్రాంతములని చెప్పబడు వానిలో యెట్టి రాజ్యాంగ విధానము నేర్పరుపదలచుచున్నారు? లాహోరు తీర్మానముద్వారా వాగ్దానము చేయబడినప్పటికి ఈ విషయము 1930 సం॥ము నాటినుండి బయటికి రాలేదు. (2) భారతదేశమునుండి పాకిస్థానును వేరుచేయుటవల్ల కలుగు లాభముల సంపూర్ణ పట్టికను కోరవలెను.

హిందూమెజారిటీ రాష్ట్రములలో స్థిరనివాస మేర్పరుచుకొన్న కోటానుకోట్ల మహమ్మదీయులు యెవ్వరిలో కూరమున నేర్పరుపబడిన పాకిస్థాను దృష్టితో నాలోచింపజాలరు. కనుక మైనారిటీ సంఘము కోరదగిన కోర్కెలనువారు నిర్వచించి, తమ ప్రధాన క్షేమలాభములకు రాజ్యాంగ సంబంధమగు రక్షణలు కోరవలెను."

## సిబ్బంది తగ్గింపు
### ఇతర శాఖలకు ఆర్థికశాఖవారి యాదాస్తు

ఢిల్లీ, ఆగస్టు 28: ఇండియా ప్రభుత్వానికి సంబంధించిన అన్ని డిపార్టుమెంటులలోను యుద్ధకాలంలో కొంతసిబ్బంది హెచ్చుచేయబడింది. కాని యుద్ధపూర్వమున్న పరిమితిలోనికే సిబ్బందిని తిరిగి తగ్గించవలెనని ఇండియా గవర్నమెంటు తాలూకు ఆర్థికశాఖవారు అన్నిడిపార్టుమెంటులను కోరుచు యాదాస్తులను పంపియున్నారు. సిబ్బందిని తగ్గించుటకు ఏమైనా అభ్యంతరములున్న యెడల ఆయా డిపార్టుమెంట్లు తెలియజేయవలసినదని సదరుయాదాస్తులలో కోరబడెను.

ఢిల్లీ సెక్రటేరియటు ఆఫీసులలో సిబ్బంది తగ్గింపు యింకనరికె ఆరంభము కావలసినదే. వేవెలు ఇంగ్లండుకు వెళ్లియుండుటవల్ల సిబ్బంది తగ్గింపు వెంటనే జరుగలేదు.

యుద్ధసప్లయి డిపార్టుమెంటు పూర్తిగా రద్దుచేయబడును. సైనికశాఖలోని యుద్ధశాఖకు విమానశాఖా రవాణా ఒప్పగింపబడును.

## ఓటరుల జాబితా సవరణ
### త్వరగా చేయాలని ప్రకాశంగారి సూచన

మధుర, ఆగస్టు 29: టి. ప్రకాశం గారు మాజీ రెవిన్యూమంత్రి యిట్లు ప్రకటించుచున్నారు:— జనరలు ఎన్నికలు మార్చి బడ్జెటు సమావేశంలోగా జరిగి క్రొత్తబడ్జెటు క్రొత్తమంత్రులే నిర్వహించెదరని అనుకొనుచుంటిని. కామన్సు సభలో అండరు సెక్రటరీ హెండర్సను గారుగూడ ప్రశ్నలకు జబాబుగ అట్లే తెలిపెను. కాని మదరాసు ప్రభుత్వంవారు యీనెల 28 వ తేదీ ప్రకటనలో అక్టోబరు 31 వ తేదీ ఓటరులజాబితా సవరణతేదీగా నిర్ణయించుచు గావించిన ప్రకటన అందరికి ఆశ్చర్యం కలిగించింది. అనగా ఎన్నికలు వచ్చే సంకురాత్రికాలంలోగాని, యింకా ఆలస్యంగా శీతకాలంలోగాగాని జరుగనేరవు. అది ఓటరులకు, అభ్యర్థులకు చాల కష్టంగానుండును. అంత ఆలస్యంగా ఓటరులజాబితా సవరించుట తప్పు. జూను లేక జులయి 30 తేదీ నిర్ణయించుట మంచిది. ప్రభుత్వంవారు యీ పొరబాటు సవరింపవలసె యుండునని, ప్రభుత్వానికి నేను వ్రాసితిని.

యుద్ధం ముగియగానే అంతరించవలసిన 93 సెక్షను ప్రకారం పాలన, ఎన్నికలుజరిగి క్రొత్త మంత్రివర్గాలు ఏర్పడేవరకు కొనసాగించి, ఎన్నికలు యింకా ఏ 9 లేక 10 నెలలవరకో జరుగకుండా చేయడం న్యాయంకాదు.

## బీహారు ఎసెంబ్లీ రద్దు

ఆగస్టు 29: బీహారు లెజిస్లేటివు ఎసెంబ్లీని రద్దుచేయు ఉత్తరువును బీహారుగవర్నరు జారీచేసియున్నారు.

1935 సం॥ ప్రభుత్వ ఇండియాశాసనము 90 సెక్షను ప్రకారం గావించబడిన ప్రొక్లమేషను మార్పు ఉత్తరువు నొకదానిని యిటీవల బీహారుగవర్నరు జారీచేసి యుంచెను.

## జాతిద్వయ సూత్రం
(1 వ పేజీ తరువాయి)

ఉంటున్నాను. అంతర్జాతీయ సమస్యల విషయమై కాంగ్రెసు అవలంబించదలచిన నైవాన్ని ఆగస్టు తీర్మానం పూర్తిగా విశదీకరించింది. జాతీయదృష్ట్యా కాంగ్రెసు కున్న ఆశయము దేశస్వాతంత్ర్యము. ఇక ఆర్థిక సమస్యలగూర్చి కాంగ్రెసు అనేక తీర్మానాలు కావించింది. కీలక పరిశ్రమలును, భారీ పరిశ్రమలునూ సమాజ స్వామిత్వంలో ఉండాలి; ఈ పరిశ్రమలపై సమాజమే యాజమాన్యం జరపాలి. చిన్నచిన్న పరిశ్రమలను వ్యక్తిస్వామ్యంలో ఉంచవచ్చును. సమాజమే ప్లానింగు మొదలైనవి చేయవలసి ఉంటుంది.

రాష్ట్రపతి స్వయం నిర్ణయాన్ని గూర్చి చేసిన ప్రకటన కాంగ్రెసు కున్న అభిప్రాయాన్ని పూర్తిగా వ్యక్తపరుస్తోంది. భారతదేశము ఏకసమష్టిగా ఉండవలెననీ, సమష్టిలో పొత్తులోనే ప్రతివ్యష్టికీ రాష్ట్రీయ స్వాతంత్ర్య ముండవలెననీ కాంగ్రెసు కోరుతోంది. కాని ఇందులో ఏదేని వ్యష్టి తాను సమష్టిలో ఉండటానికి ఒల్లనిచో, కాంగ్రెసు దానికి అడ్డుపెట్టదు.

కాంగ్రెసు స్వయంనిర్ణయ సూత్రాన్ని ఇదివరకే ఆమోదించింది. కాని భారతదేశాన్ని రెండు లేక అనేక భాగాల్లోకి విభజించడం హానికరం; దేశరక్షణకు దేశ అభివృద్ధికి దీనివల్ల అపకారం కలుగుతుంది.

అయినప్పటికీ, ఏదైనా వ్యష్టి విడిపడదలచినచో సమష్టిలోంచి విడిపోవచ్చును; కాని ఇట్లా వేరుపడడానికి ఆ వ్యష్టిలోని జనాభా అంతా అంగీకరించవలసి యుంటుంది. ఈ స్వయంనిర్ణయ సూత్రానికి మనం ఒకసారి ఒప్పుకొంటే, అసలు వేరుపడాలనే కోరికే సమసిపోతుందని నా అభిప్రాయము. భారతదేశం ఏకజాతి కావచ్చును లేక అనేక జాతులు కావచ్చును; 'జాతి' అనే పదాన్ని ఇంకాఎవ్వరూ సంతృప్తికరంగా నిర్వచించలేదు. నూరు భిన్న జాతులు ఏక సమష్టిగా వ్యవహరించదలచినచో ఈనూటిని కూడా ఏకజాతిగానే పరిగణించాలి. కాని దేశంలో ఏఒక్క వర్గం విడిపడదలచినప్పటికీ ఆవర్గము విజాతీయమే అవుతుంది. ఈ వర్గంతో ఐక్యం సాధించలేనప్పుడు, రెండుపక్షాలకు ఒప్పుదల అయ్యే ఇంకో మార్గాన్ని వెదుక్కోవలసివస్తుంది. దేశంలో జాతి ద్వైవిధ్యం ఉందనే ఈ సిద్ధాంతము మతభేదంమీద ఆధారపడి ఉంది. ఆధునిక ప్రపంచ పరిస్థితులకూ ఈ సిద్ధాంతానికి ఎట్టి సమన్వయమూ గోచరించడంలేదు. నాకిది దుర్గ్రాహ్యంగా ఉంది. మధ్యయుగాలకు చెందినదీ సిద్ధాంతము. మతదృష్ట్యా భిన్నమైన ఈ రెండు 'జాతులు'ను భారతదేశంలోని ప్రతిపల్లెలోను పరస్పరం పెనవేసుకొని ఉన్నవి. ఇట్టివారిని పరస్పరం వేరుచేయడం దుస్సాధ్యము. ఒకవేళ అల్లా చేస్తే దేశంలో బ్రహ్మాండమైన సంక్షోభం జన్మించగలదు. ఈపద్ధతిన దేశాన్ని విభజించినట్లయితే, ఒకభాగంలోని పలుకోట్ల జనాభా మతదృష్ట్యా రెండవ భాగానికి చెందినవారౌతారు; రెండవభాగము యొక్క జనాభాలోని పదవవంతు మొదటి భాగానికి చెందినవారౌతారు. ఈజాతిద్వయ సిద్ధాంతంప్రకారము, ముస్లింభాగాలలో ఉన్న హిందువులునూ హిందూ ప్రదేశాలలోని ముస్లింలునూ విజాతీయులౌతారు, ఈ సిద్ధాంతాన్ని అంగీకరించినట్లయితే అనేకరకాల బాధలు కలుగగలవు; ఈవిజాతీయవర్గాన్ని సమాజము పూర్తిగా ఐక్యం చేసుకోవడం అసంభవమౌతుంది; యుద్ధసమయంలో ఈ వర్గాలు సంకట హేతువులవుతవి."

భవిష్యత్ భారత ప్రభుత్వముయొక్క ఆయుధాగారంలో ఆటంబాంబు కూడా ఉంచుతారా అన్న ప్రశ్నకు పండిట్ నెహ్రూ ఇలా సమాధానం చెప్పారు:

ప్రపంచ పరిస్థితులు ఇట్లాగే ఉన్నంతకాలమూ, స్వయంరక్షణకై ప్రతిదేశమూ యుద్ధపరికరాలను సృష్టించుకొని ప్రయోగించవలసియే ఉంటుంది. భారత విజ్ఞానికులు పరిశోధనలుచేసి, అణుశక్తిని నిర్మాణకార్యాలకై వినియోగించగలుగుతారని ఆశిస్తున్నాను. భారతదేశము ఆత్మరక్షణకై వీలైన అన్ని పద్ధతులను అవలంబిస్తుందనడం నిస్సంశయము. కాని భారతదేశము ఇతర దేశముల సహకారంతో ఆటంబాంబు లెవ్వరూ ఉపయోగించకుండా చేయవలెనని కోరుతున్నాను.

## సర్ ఫిరోజ్ ఖాన్ నూన్
### రాజప్రతినిధి కార్యవర్గము నుండి రాజీనామా

న్యూఢిల్లీ, ఆగస్టు 29: పార్టీరాజకీయములలో పాల్గొన వీలగుటకుగాను తాను 1945 సం॥ సెప్టెంబరు 15 తేదీన కార్యనిర్వాహకవర్గమునుండి రాజీనామా నివ్వ గోరుచుంటినని సర్ ఫిరోజ్ ఖాను నూన్ గారు గవర్నరు జనరలుకు తెలియజేసిరి. ఆయన రాజీనామాను గవర్నరుజనరలు అంగీకరించెను అని ఒక ప్రభుత్వ ప్రకటన తెలుపుచున్నది.

## గత ఉద్యమంలో ఆంధ్రులకృషి
### కళా వెంకటరావుగారి ప్రశంస

మద్రాస్, ఆగస్టు 30: గత ఉద్యమములో ఆంధ్రరాష్ట్రము చేసిన మహత్తర కార్యములకు నేనెంతయు సంతోషించుచున్నానని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘ ప్రధానకార్యదర్శి కళా వెంకటరావుగారు ఆంధ్రపత్రిక విలేఖరితో ముచ్చటిస్తూ చెప్పారు.

పలుప్రదేశములలో తుపాకీకాల్పులకు లోనై ప్రాణముల నర్పించిన ఆంధ్రవీరులకు నాజోహర్లన్నారు.

శ్రీ వెంకటరావుగారు ఇలా చెప్పారు. 1921 కి దరిమిలా జరిగిన ఏ కాంగ్రెసు ఉద్యమములోను విద్యార్థులు యీసారిచేసినంత సహాయము చేసియుండలేదు. వారి ఉత్సాహము త్యాగము నన్నెంతయు ఆనందపరచినవి.

రాష్ట్రకాంగ్రెసుసంఘ ఆదేశంప్రకారము మూడు మ్యునిసిపాలిటీలు తప్ప కాంగ్రెసు పరిపాలనలోనున్న అన్ని స్థానిక సంస్థలును ఆగస్టు తీర్మానము నామోదించి తత్ఫలితముగ సూపర్సీడ్ చేయబడుట ఎంతయు సంతోషింపవలసిన విషయము. స్థానిక సంస్థలలోనున్నవారు ప్రజాభ్యుదయమునకే పాటుబడి ముందంజవేయరను అపవాదుకు ఇది జవాబు. అంతియేకాక ఎన్నికలుగల ప్రతి రాజకీయసంస్థలోకూడ కాంగ్రెసునకు గల పలుకుబడికిని ఇది ఉదాహరణమై యున్నది. ఆ యా సభ్యులను అధ్యక్షులను అభినందించుచున్నాను.

భవిష్యత్కార్యక్రమమునుగురించిప్రశ్నించగా అధ్యక్షుడు ప్రకాశంగారు మధుర వెళ్లుటచే వారిని కలుసుకోలేక పోయానన్నారు. త్వరలో వారిని సంప్రదించి రాష్ట్రకాంగ్రెసుసంఘ ఆఫీసును పునస్థాపనచేసి నిర్దిష్టమైన కార్యక్రమమును అమలు జరిపించెదనని కళా వెంకటరావుగారు తెలిపారు.

నాకొకవారమురోజులు విశ్రాంతి చాలును, పిమ్మట బయలుదేరి అన్నిజిల్లాలకునువెళ్లి కాంగ్రెసు సంస్థలను సజీవముగ చేయుటకు పూర్ణకృషి చేసెదనని చెప్పారు.

### కార్యక్రమం

మద్రాస్, ఆగస్టు 30: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి కళా వెంకటరావుగారు నేడు కలకత్తా మెయిలులో బయలుదేరి రేపు ఉదయం బెజవాడచేరి మధ్యాహ్నము బందరుపోయి డాక్టరు పట్టాభిగారి దర్శనం చేస్తారు. సెప్టెంబరు 1 తేదీ మధ్యాహ్నం 3 గంటలకు పూరీ ప్యాసెంజరులో రాజమండ్రి చేరి 2 తేదీ ఉదయం బొబ్బర్లంకమీదుగా సాయంత్రమునకు అమలాపురం చేరెదరు.

మదరాసు, ఆగస్టు 30: శ్రీ కళా వెంకటరావుగారు, ఆం. రా. కాం. సంఘ కార్యదర్శి తదితరులు నిన్న సాయంకాలం 4 గం॥ వేలూరు సెంట్రలు జెయిలునుండి విడుదలచేయబడిరి. ఒకనెల పెరోలుపై పుదుకోటి కోదండరామయ్యగారు విడుదలయిరి. బాలచంద్ర ఆర్ట్టిగారు మదరాసు పెనిటెన్షియరీనుండి విడుదలయిరి. విడుదలయినవారిలో యీ దిగువవారు నేడుదయం మదరాసు వచ్చిరి:—శ్రీ కళా వెంకటరావుగారు, ఆర్. ఆర్. దళవాయిగారు, నేను లచ్చన్నగారు, పిల్లా రాజులరెడ్డి, మిరియాల వెంకటరావు, సంపత్కుమారాచారిగారు, టి. కోదండరామయ్యగారు.

### ఇంకా ఉన్న నిర్బంధితులు

శ్రీ అన్నపూర్ణయ్య, కాకాని వెంకటరత్నం, అన్నె అంజయ్య, పి. రామమూర్తి, రాజమన్నారుశెట్టి, వి. ఆర్. చిత్రే, ఎం. ఎం. లక్ష్మీపతి, మద్దు రామలింగదేవరు, (ఎం. ఎల్. ఏ.) శివన్నదేవరు, రామకృష్ణ దేవరు, ఎ. ఎస్. కె. అయ్యంగారు, కె. భుజంగరావుగార్లు యింకను నిర్బంధములో నున్నారు. పేట బాపయ్యగారు పెరోలులోనున్నారు.

ఆర్. ఆర్. దళవాయిగారు, మదరాసు ఆం. కాం. సంఘ కార్యదర్శి యిట్లు వ్రాయుచున్నారు:

నన్ను విడుదల చేసినవార్త నాకు ఆనందమును విచారమును కలిగించుచున్నది. నా మిత్రులు జి. రాజమన్నారుశెట్టి, వి. ఆర్. చిత్రే, లక్ష్మీపతిగార్లు యింకను నిర్బంధమునవుండ, నేనెట్లు సంతసింపగలను. మదరాసు నివాసుల సహకారాదరములవలన కార్యదర్శి పదవి అందరికి సంతృప్తికరముగ నిర్వహింపగలనని నమ్ముచున్నాను.

### కాంగ్రెసు సంఘటన

తిరుపతి, ఆగస్టు 28: ఈ పట్టణ కాంగ్రెసు కమిటీ నేడు పునర్నిర్మాణమైనది. యస్. యల్. యస్. శెట్టిగారు అధ్యక్షులుగాను, పి. యస్. సుబ్బారెడ్డిగారు కార్యదర్శిగాను ఎన్నిక అయినారు. వి. శంకరయ్య, డబ్ల్యు. వి. శ్రీనివాసులు, వి. వెంకటముని శెట్టి, సాతలూరు మునిరత్నం శెట్టి, వి. శ్రీనివాసులు, పి. మునిస్వామి యస్. కందప్పగారలు కార్యసంఘ సభ్యులుగా ఎన్నిక అయినారు.

## జపానులో మిత్రప్రవేశం
(1-వ పేజీ తరువాయి)

ఫుకాకా సైనికులు 1800 అమెరికను నౌకా సైనికులు మిత్రసేనలు జపానుదక్షిణ తీరముమీదకు దిగుటకు ప్రారంభించిరి.

జనరలు మెకార్థరుగారు ఎక్కివచ్చిన విమానంపేరు "బాటాన్." విమానాలనుండి అమెరికను సైన్యం దిగుచుండినప్పుడు, మెకార్థరుగారి విమానం జపాను మీదనే ఎగురుచుండెను. యిప్పుడు జపానులో దిగుటకై వచ్చిన మిత్రసేన ఇంకా కొన్ని రోజులవరకు దిగుతూనే ఉంటుంది. అంతవరకు మెకార్థరుగారు వేచియుండ దలంచలేదు.

జపానుమీద మొట్టమొదటగా అడుగు పెట్టే సైనికులతోనే మెకార్థరుగారు ముమ్మొందుగా దిగుటకు ఇదివరకే నిర్ణయింపబడెను.

### అమెరికను విమానానికి ప్రమాదం

జపానులోని అట్సుగీ విమానాశ్రయంలో అమెరికను సేనను దింపుటకై ఓకినావా దీవినుండి బయలుదేరుచుండగా ఒక పెద్ద అమెరికను విమానం, ఓకినావా విమానాశ్రయంలో ప్రమాదవశాత్తుగా ధ్వంసమైనది. దీనిలోని అమెరికను నౌకాభటులు 20 మంది మరణించారు. విలువగల సైనిక సామగ్రికూడా ధ్వంసమైనది అని ఓకినావా రేడియో నేడు ప్రకటించింది. మరణించిన అమెరికనులు చాలా అనుభవముగల యోధులు. ఈ ప్రమాదం వల్లనే మంగళవారం ఉదయం జపాన్ నుండి కొంత సంజాయిషీ రాబట్టుటకు ఆలస్యమైంది.

### అట్సుగీ విమానాశ్రయంలో

అమెరికను విమానాలనుండి అమెరికను సేనలు అట్సుగీ విమానాశ్రయంలో దిగి సుమారు 18 చదరపుమైళ్ల ప్రదేశముచుట్టు బారులుతీర్చి బలమైన ప్రాకారముగా ఏర్పడినవి. ఈ ప్రదేశమంతటను జపాను వాళ్లు ఎవ్వరూ లేకుండా ఖాళీచేయబడినది. ఈ ప్రదేశంలోనే జనరలు మెకార్థరుగారి సైనికాధికారుల కార్యాలయము ఏర్పాటుచేయబడినది. జపాను ఆక్రమణకై సేనలు పూర్తిగా దింపబడునిమిత్తమై రోజు 1 కి 300 విమానాలు మిత్రసేనలతో ఇచటికి పంపబడుచుండును.

"మిస్సూరీ" అనే అమెరికను యుద్ధనావమీద జపాను శరణాగతి పత్రముపై సంతకములు చేయునప్పుడు వందలకొలది పత్రికావిలేఖరులు అక్కడహాజరవుతారు.

### యోకోసూకా రేవులో

అడ్మిరలు చెస్టరు నిమిట్జ్ గారు మిత్రనావలనుండి సేనలు దిగుటకు ఉత్తరువు జారీచేసినవెంటనే నేడు తెల్లవారుజామునుంచే సేనలు దిగుటకు ప్రారంభించాయి. "నేడే సుదినం" అని తమ నావలలోని వారి కందరికి నిమిట్జ్ గారు కర్తవ్యసూచకముగా సందేశమును నిస్తంత్రీవార్తగా పంపించినారు.

నావలనుండి సేనలు దిగుటకు కొంచెం ముందుగానే అట్సుగీ విమానాశ్రయంలో అమెరికనువిమానాలనుండి అమెరికను సేనలు దిగినవి.

యోకోసూకా రేవులో సముద్రతీరమున అమెరికను సైనిక స్థావరమును ఏర్పాటు చేస్తామని అడ్మిరలు నిమిట్జ్ గారు పత్రికా ప్రతినిధితో చెప్పారు.

### యోకోసూకా రేవును అమెరికాకు ఒప్పగించుట

క్రింకోమలీ, ఆగస్టు 30: ఒక చిన్న సిరంగినావమీద తెల్ల జెండా ఎగురవేసి, జపానుతరపు రాయబారులు కొందరు పెనాంగు సమీపంలో ఉన్న "నెల్సను" అను బ్రిటిష్ యుద్ధనావవద్దకు వచ్చారు. ఆనావమీదనున్న బ్రిటిష్ నైసుఅడ్మిరలు వాకరుగారితో సంభాషించారు. వచ్చిన జపానురాయబారులు నిరాయుధులుగానే వచ్చారు. వాకరుగారి భోజనపుగదిలోనికి వారిని తీసికొని వెళ్లిరి. జపాను రాయబారులకు వాకరుగారు అడిగిన ప్రశ్నలకు వారు సమాధానములు చెప్పిన అనంతరము వారిని తిరిగి సముద్రతీరానికి చేర్చడమైనది.

### బర్మాలోని జపానుసేనల శరణాగతి

రంగూను, ఆగస్టు 29: బర్మాలో ఇంకా 70 వేల జపానుసేన మిగిలియున్నదనియు ఈ జపానుసేన యావత్తు బ్రిటిషువారికి శరణుజొచ్చుటకు సిద్ధంగా ఉన్నదనియు బర్మాలోని జపానుసేనానియగు జనరలు కిమూరుగారు మౌల్మీనునుండి, బ్రిటిషు అధికారులకు కబురుపంపించాడు. ఈ శరణాగతిగూర్చి మాట్లాడుటకై తన రాయబారిని సిట్టాంగు లోయలోని అబ్యాగన్టకు పంపిస్తానని తెలియజేశాడు. మూడురోజుల క్రిందట యీ విషయమై అబ్యాలోనే ఒక ప్రాథమిక సమావేశం జరిగింది.

### పోర్టు ఆర్థరులో రష్యను జెండా

మాస్కో, ఆగస్టు 29: ఇంతవరకు జపానువారి కింద నున్న పోర్టు ఆర్థరు రేవులో నేడు రష్యను జెండా ఎగురుతోంది. 40 సం॥నుంచియు అక్కడ జపాను జెండా ఎగురుతూవుంది. అంతకు పూర్వము పోర్టు ఆర్థరురేవు రష్యావారి వశమై యుండెను.

## త్యాగ... అలవరచుకోవాలి
### పట్టభద్రులకు లక్ష్మణరావుగారి హితవు

మదరాసు, ఆగస్టు 30: ఏ వృత్తి అనుసరించినా నూతన పట్టభద్రులు సంఘసేవా త్యాగగుణములను అలవరచుకోవాలని న్యా॥ కె. పి. లక్ష్మణరావుగారు, నేడుదయం మదరాసు పట్టప్రదానోత్సవమునందు ఉపన్యసించుచు హెచ్చరించిరి.

నూతన పట్టభద్రుల నభినందించుచు వారిట్లు నుడివిరి:—రెండో ప్రపంచయుద్ధంతో శిథిలమయిన క్రొత్తప్రపంచంలోకి మీరు చొరబడుచున్నారు. ఈ నూతన ప్రపంచమందు సామాన్యమానవుని హక్కులు సౌకర్యాలు, కష్టసుఖాలనుగూర్చి ఎంతో శ్రద్ధవహించవలసియున్నది. రాజనీతిజ్ఞులు అనేకవిధానాలు సూచిస్తారు. మామూలుపద్ధతులు, సాక్షీఅయిన జీవితం మీకగుపడదు. పూర్వసాంప్రదాయాల త్రోసిన, తృణీకారమే కలిగా అలవరచుకొని సాగించుట, పరోపకారబుద్ధి శూన్యత ప్రబలుట కూడదు. అయినను మీరు నిరాశచెందక ఉత్సాహంతో ధైర్యంతో పనిచేయగల సమర్థత నేర్పు మీవిద్య మీకొసంగినది.

ఇంకను ఉన్నతవిద్య నేర్వదలచిన మీలో కొందరుతప్ప తక్కినవారు జీవనోపాధికి వృత్తులగూర్చి ఆలోచించుచుందురు. మనదేశంగూడ యితరదేశాలతోబాటు అనేక నూతన పరిశ్రమలకు పథకాలు తయారుచేసింది. మీలో పెక్కుమందికి అందు ఉద్యోగాలు దొరకగలవు. ఇట్టి పరిస్థితులలో మైన్స వృత్తివిద్యలు నేర్చినవారు ఆర్ట్సు, కళలు, చరిత్రలు చదివినవారిని చులకనగ చూడరాదని నేను హెచ్చరించుచున్నాను. విశ్వవిద్యాలయంలో మీరు నేర్వవలసిన మొదటిపాఠం, అలవరచుకొనవలసిన సుగుణం "కల్చరు" విజ్ఞానం. మనుష్యత్వం, మంచి మనస్సుని, ఆచారాలను సన్మార్గానికి మార్చేది విజ్ఞానవిధి. మంచి ప్రవర్తన, మంచి అభిరుచులు లేకుంటే ఎంత చదివితే నేమిలాభం. విద్యావంతుల మనోగర్వం ఉండరాదు. జ్ఞానపిపాసత్వమే ప్రధానలక్ష్యంగా ఉండాలి. ఇతరులకు మాటవల్ల గాని, చేష్టలవల్లగాని నొప్పించరాదు. ఇవే విజ్ఞానలక్షణాలు. తన తప్పు తెలిసి, యితరులు తన నెట్లు చూస్తారో అవ్యక్తితో తన్ను తాను చూచుకోవాలి. సమాజే నిజమనే పట్టుదల లుండుకోవటం జ్ఞానలక్షణం. సత్ప్రవర్తన సుగుణ సంపద గల్గియుండాలి.

"మీకు సేవాతత్పరత యుండాలి. మనదేశం పేదదేశమని అనేక తరాలనుండి తెలుసు. అక్షరజ్ఞానం తక్కువ, రోగాలు ఎక్కువ. ఈమూడు పీడలు తొలగించే పూచీ మీమీదే గలదు. స్వార్థరహితమగు సంఘసేవ చేయుటే జీవితాదర్శంగా బోధించిన యోగులుండిన పుణ్యభూమియిది. కనుక మీరేవృత్తిలో నున్నా యీసేవాతత్పరత, త్యాగబుద్ధి అలవరచుకోమని కోరెదను. సంఘసంస్కారోద్యమము లన్నింట మీరు నాయకత్వం వహించవలెనని దేశం యెదురు చూచుచున్నది.

"స్త్రీలు నానాటికి ఎక్కువగ పట్టములు పొందుట సంతోషదాయకము. పట్టముల మర్యాదను ఎక్కువగ నుంచేవారుగనుక స్త్రీ పట్టభద్రులే దేశంలో ముఖ్యముగా సౌఖ్య విజ్ఞానములను వ్యాపింపజేయు వారలు. ముందు తరాలవారి సౌభాగ్యమును మీరు బాగుగ కాపాడగలరు" అని న్యా॥ లక్ష్మణరావుగారు అభినందించిరి.

## పెనాంగుకు బ్రిటిష్ యుద్ధనావలు

లండను, ఆగస్టు 29: మలయానుండి విరివిగా రబ్బరును ఎగుమతిచేసేటటువంటి పెనాంగురేవు సమీపమునకు బ్రిటిషు యుద్ధనావలు చేరినవి. ఇచటినుంచి సింగపూరు రేవు 400 మైళ్ల దూరంలో ఉంది. పెనాంగురేవు మలాకా జలసంధిలోనిది.

మరొక బ్రిటిష్ సేన సింగపూరునకు ఉత్తరంగా 650 మైళ్లలో ఉన్న సుమత్రాదీవి ఉత్తరకొనలోనున్న సాబాంగును చేరింది. ఈ బ్రిటిష్ సేన బ్రిటిష్ యీస్టుయిండీసు దీవులకు చెందినదై యున్నది.

## హాంకాంగు రేవులో బ్రిటిష్ ప్రవేశం

హాంకాంగు, ఆగస్టు 29: హాంకాంగు రేవు సమీపంలోనికి "ఇండామిటబిల్" అనే బ్రిటిషు యుద్ధనావ వెళ్లినది.

## కొరియాను అమెరికను సేన ఆక్రమిస్తుంది

అమెరికను 8 వ సైన్యం టోకియో నగరానికి ఉత్తరంగా ఉన్న హోన్షూను ఆక్రమించును. అమెరికను 6 వ సైన్యము మిగిలిన జపానును ఆక్రమించును. అమెరికను 24 వ సైన్యం కొరియా రాజ్యమును ఆక్రమించును.

## యోకోసూకా ఆక్రమణ

యోకోసూకా రేవును. అడ్మిరలు రాబర్టు కార్నీ గారు నేడు స్వాధీన విధిగా ఆక్రమించారు.

# "రష్యాకమ్యూనిజం ఇండియాకు కూడదు"

## టి. ప్రకాశంగారి ఉపన్యాసం

తిరుప్పనం, ఆగష్టు 28: తిరుప్పనంలో సమావేశమైన గ్రామనాథు జిల్లా కిసాను మహాసభను ఉపక్రమిస్తూ టి. ప్రకాశం పంతులు గారు యిలా ఉపన్యసించారు.

సిమ్లాసభ జరుగుచుండిన రోజులలో ఆ సభ వ్యర్థమైనదనీ భగ్నమైనదనీ చాలా మంది అన్నారు. ఆ సభా సంకల్పం సిద్ధించలేదన్నారు. కాని, నేనా అభిప్రాయం కలవాడనుకాను. సిమ్లాసభవల్ల చాలా చిక్కులు తొలగింపబడినవి. మన స్వాతంత్ర్య పగమావధికి మరింత చేరువలోకి రాగ్గిగా నాము.

కాంగ్రెసు మహాసభ హిందూసంఘాభిమానమే కలదనియు, అది హిందువుల కొరకే ముఖ్యంగా ఏర్పడినదనియు వాదించుటకు వీలులేదు. కాంగ్రెసు తరఫున మాట్లాడుటకై వేవెలుప్రభువు గాంధిమహాత్మునిని ఆహ్వానిస్తే ఆయన అందుకు అంగీకరించకుండా, కాంగ్రెసు అధ్యక్షుడైన ఆజాదుగారినే కాంగ్రెసు తరఫు ప్రతినిధిగా ఆహ్వానించవలసినదని మహాత్ముడు అన్నాడు. జిన్నాగారి పెంకితనము వల్లనే సిమ్లాసభ చెడిపోయింది. రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు సభవారు జాతీయపక్ష మహామ్మదీయులను కొందరిని అభ్యర్థులుగా ప్రతిష్ఠింపదలంచియున్నారు. ఈ జాతీయపక్ష మహమ్మదీయ అభ్యర్థులకు మీవోట్లు యివ్వవలెనని కోరుచున్నాను.

మాస్కోప్రాబల్యమునకు ఇండియాలో అవకాశము లేదు. మన దేశంలో పురాతన కాలమునుండియే కమ్యూనిజం ఉన్నది. మన దేశము విదేశీయుల దండయాత్రలకు పాల్పడుటకు పూర్వము మన దేశంలో సంపూర్ణమైన సమత్వము సర్వమానవ సోదరభావము వెలసియుండెను. ప్రపంచమునకంతకు జ్ఞానజ్యోతిని విస్తరింపజేసినది మనదేశమే. రష్యాలోని కమ్యూనిజము హింసాత్మకమైనది. అట్టి కమ్యూనిస్టు తత్వమునకు మన జాతీయోద్యమములో చోటులేదు. మన, జాతీయోద్యమము అహింసాత్మకమైనది.

భారత దేశములోని కమ్యూనిస్టులందరును తమపార్టీని వదలుకొని కాంగ్రెసు మహాసభలో చేరి ఆ సంస్థనే మరింత బలిష్ఠమొనర్చవలెనని కోరుచున్నాను.

కర్షక సంఘమును ఉద్ధరించుటకు సమర్థమైన అర్హమైన సంస్థ కాంగ్రెసు మహాసభ ఒక్కటే. గత 10 సం॥లలో కాంగ్రెసు సభ చాలా అద్భుతమైన కార్యములను చేయగల్గినది. రైతులందరూ కాంగ్రెసుసభాదర్శమును హర్షించి అనుసరించుటవల్లనే కాంగ్రెసు అనేక ఘనకార్యములను చేయగల్గినది.

ఇంగ్లండులో కార్మికప్రభుత్వం ఏర్పడింది. కాంగ్రెసుపై నిషేధంతొలగింపబడినది. కనుక, యీతరుణంలో రాబోవుఎన్నికలయందు కాంగ్రెసు అఖండవిజయమును సాధించి యావద్భారత దేశం కాంగ్రెసు పక్షాభిమానం వహించియున్నదని లోకానికి ఋజువుచేసి మనము సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించగలము.

### యన్. జి. రంగాగారు రాలేదు

యన్. జి. రంగాగారు రాలేకపోవుట చేత వారిస్థానే తమిళనాడు కాంగ్రెసు ప్రెసిడెంటగు కామరాజనాడారుగారు జాతీయపతాక ప్రతిష్ఠ చేశారు. రైతు జనోద్ధరణకై పోరాడినటువంటిది కాంగ్రెసు మహాసభ గనుక, కర్షకులందరును కాంగ్రెసునే అనుసరించి యీ జాతీయపతాకమునకు నమస్కరించవలెననియు కాంగ్రెసు అభ్యర్థులకే రాబోవు ఎన్నికల్లో వారి వోట్లు యివ్వవలెననియు కామరాజ నాడారుగారు ఉపన్యసిస్తు చెప్పారు.

ఈ కిసానుసభకు [illegible] పి. రామస్వామి చెట్టిగారు అధ్యక్ష[illegible] వహించారు. భక్తవత్సలంగారు మున్[illegible] నాయకులు సభలో ఉపన్యసించారు. [illegible] సాయంకాలం సభ సమాప్తమైనది.

మధురనుంచి సభానాయక ప్రముఖులు రాగానే గొప్ప ఊరేగింపుతో వారి నందరిని సభా మంటపమునకు తీసికొనిపోయిరి.

# కోటిపల్లి రైలుదారి తిరిగి వెయ్యాలి

రాజమండ్రి, ఆగస్టు 27: కొత్తరైలు దార్లు వేయాలని, కాకినాడ - కోటిపల్లి దారిని తిరిగి సాగించాలని, ఎంజిన్లు, వాగన్లు తయారుచేసే కార్ఖానా స్థాపించాలనీ యం. యస్. యం. రైల్వే యూనియన్ రాజమండ్రి శాఖవారు రాజమండ్రి, నిడదవోలు కేంద్రాలలో 20 నుంచి నేటివరకు జరిపిన 'సెక్యూరిటీ ఆఫ్ సర్వీస్' వారముసభలలో తీర్మానించారు. మూడు లక్షలమంది రైల్వే కార్మికులను తొలగించుటకు రైల్వేబోర్డువారు తలపెట్టిన స్కీము ఖండించారు.

# ఆంధ్రసంపాదకుల మహాసభ

బెజవాడ దివ్యజ్ఞాన సమాజభవనములో ఆగస్టు 26 ఉదయం కాశా సుబ్బారావుగారి అధ్యక్షతన ఆంధ్రరాష్ట్రపత్రికా సంపాదకులమూడో మహాసభ మొదలైనది. కోజ అయోధ్యరామయ్యగారు పత్రికా సంపాదకుల గౌరవార్థము సభకు ముందు అల్పవిందు చేశారు.

జొన్నలగడ్డ సత్యనారాయణగారు, త్రిలింగ సంపాదకులు, సభను ప్రారంభించారు. ఆహ్వానసంఘాధ్యక్షుడు క. వేమనరెడ్డిగారు స్వాగతోపన్యాసం చేసినమీదట ప్రధానకార్యదర్శి చిలకమర్తి సత్యనారాయణాచార్యగారు నివేదికను చదివారు.

అధ్యక్షోపన్యాసంతో ఉదయపు సమావేశమైనది. మధ్యాహ్న సమావేశంలో తీర్మానాలపై చర్చలు జరిగినవి. శ్రీరామమూర్తిగారు 5-30 కు అల్పవిందు చేశారు. అనంతరం పాటకచ్చేరి జరిగినది.

## తీర్మానములు

సుభాశ్చంద్రబోసు, డాక్టరు అరండేల్ గారల మృతికిని, సుసర్ల సుబ్బారావు, ముట్నూరి కృష్ణారావుగార్ల మృతికి సభవారు పరామర్శ తీర్మానాలు చేశారు.

మద్రాస్ ప్రభుత్వ యుద్ధానంతర పునర్నిర్మాణసంఘములో పత్రికలవారికి ప్రాతినిధ్య మివ్వవలెననిన్ని, ఆంధ్రసంపాదకుల సంఘం తరఫున ఒకప్రతినిధిని నియమించవలెననిన్నీ కోర్నారు.

న్యూస్ప్రింటుకు న్యూస్ పేపరు కంట్రోలు ఆర్డరులను రద్దుచేయ గోరినారు.

వార్తలు, వ్యాసములు మొదలైనవాటి టపాబట్వాడాకు కూడ రిజిస్టర్డువార్తాపత్రికలకు లాగాక న్సెషన్ ఇవ్వగోరారు. ఇట్టి వార్తలకు పోస్టల్ లేట్ ఫీజులు లేకుండా చేయగోరారు.

ప్రభుత్వమువారు గ్రంథాలయాలకు కొనటము, ప్రకటనలు ఇవ్వడములో పత్రికలన్నిటినీ సమదృష్టిలో చూడగోరారు.

ప్రధానకార్యాలయమును బెజవాడలో ముట్నూరి కృష్ణరాయ స్మారకభవనముగా కట్టుటకు కార్యవర్గంవారు చేసిన తీర్మానం సభవారు ఆమోదించారు.

# ఆంధ్రపత్రికా సంపాదకుల సంఘ కార్యనిర్వాహకవర్గం

బెజవాడలో జరిగిన మూడో మహాసభలో యీ విధంగా ఎన్నికలు జరిగినవి.

అధ్యక్షుడు: కాశా సుబ్బారావు, మదరాసు, ఇండియన్ ఎక్స్ప్రెస్; ఉపాధ్యక్షుడు: కొటూరి వేంకటేశ్వరరావు, బందరు, కృష్ణాపత్రిక; ప్రధానకార్యదర్శి: చిలకమర్తి సత్యనారాయణాచార్య, రాజమండ్రి, శ్రమజీవి; సహాయకార్యదర్శి: క. వేమనరెడ్డి, బెజవాడ, కృషి;

కార్యవర్గసభ్యులు: శివలెంక శంభుప్రసాద్, మద్రాసు, ఆంధ్రపత్రిక; అడవి బాపిరాజు, హైదరాబాదు, మీజాన్; గర్రె వీరరాఘవగుప్త, వ్యాయామకళ; కడప నర్సయ్య, తిరుపతి, రాయలసీమ; డా॥ డి. అప్పారావు, మద్రాస్, సూర్యప్రభ; నెల్లూరు రామానాయుడు, నెల్లూరు జమీన్రైతు; అన్నవరపు సుబ్బారావు గుప్త, బెజవాడ, భారతీయవైశ్య; బండి బుచ్చయ్య, బెజవాడ, ములుకోల; అయ్యంకి వెంకటరమణయ్య, బెజవాడ, దివ్యజ్ఞానదీపిక; కంభంపాటి సత్యనారాయణ, బెజవాడ, ప్రజాశక్తి; భమిడిపాటి కృష్ణమూర్తి, శ్రీకాకుళం, ప్రజావాణి.

# విశాఖపద్మశాలి మహాసభ

విశాఖపట్నం, ఆగస్టు 26: భావనారుషి సేవా సొసైటీ యాజమాన్యాన జిల్లా పద్మశాలి మహాజనసభ చింతలపూడి అంజనేయులుగారి అధ్యక్షతను నిన్న జరిగింది. ప్రగడ కోటయ్యగారు సభను ప్రారంభించారు. ప్రగడ బాలనాసుగారు యుద్ధానంతరం చేనేత పారిశ్రామికుల కర్తవ్యమును చెప్పారు. అక్కల కోటయ్యగారు, పద్మశాలీ సంఘంవారు వివిధ ప్రాంతాలలో పడుచున్న బాధలూ, విద్యాభివృద్ధికి సంఘం చేయవలసిన కృషి మున్నగు విషయాలను చెప్పారు. రాపర్తి జగన్నాథరావు, వానపల్లి పైడయ్య, రాచా బత్తుల భావనారుషి గారలు మాట్లాడారు. చేనేత పారిశ్రామికులకు అవసరం అయిన నూలూ రంగూ కంట్రోలు ధరలకు సరఫరా చేయించాలని ప్రభుత్వం వారిని కోరారు. యుద్ధానంతరం మిల్లు పోటీ నుంచి చేనేతకు అవసరమైన రక్షణ ఇవ్వాలనీ. భారతదేశములో బట్టలమిల్లుల స్థాపనకు అనుమతి ఇవ్వకూడదనీ ప్రభుత్వాన్ని కోరారు. రాట్నపరిశ్రమపై విశేషజనం ఆధారపడియున్న యీజిల్లాలో పత్తిపంటను ప్రభుత్వం నిషేధించుటవల్ల చాలామంది నిరుద్యోగులైనారు. చేనేతవారికి నూలుకొరత మరీ విషమించింది. కాన పైనిషేధాన్ని తొలగించాలని ప్రభుత్వంవారిని కోరారు. అఖిలభారత పద్మశాలి (9 వ) మహాసభను ఆంధ్రదేశంలో జరిగించ పైమహాసభ వర్కింగ్ కమిటీ వారిని కోరారు.

# సుభాష్బోసు పరామర్శ సభలు

## ఏలూరు

కాలేజీవిద్యార్థులు 27 న కాలేజీకి పోలేదు. ఇతర పాఠశాలల విద్యార్థులుకూడా పలువురు పోలేదు. మోతే నారాయణరావుగారి అధ్యక్షతన సాయంత్రం జరిగిన సభలో ముదిగంటి జగన్నశాస్త్రి, బుద్ధిరాజు రాజభూషణరావు, కవులూరి వేంకటేశ్వరరావు, కొమ్మారెడ్డి సూర్యనారాయణగారలు ఉపన్యసించారు.

## తెనాలి

సుభాశ్చంద్రుని మరణవార్త తెలియగానే హర్తాళం జరిగినది. విద్యార్థులు పాఠశాలలకు పోలేదు. బోసుఫోటోను నల్లజండాలతో ఊరేగించారు. మహమ్మద్ ఇస్మాయిల్ సాహెబుగారి అధ్యక్షతన జరిగినసభలో మంతెన వెంకటరాజు, శరణు రామ స్వామిచౌదరి, నీలం, రాఘవయ్య నాయుడు, తుమ్మల ధనలక్ష్మీదేవి, పండిత మదనమోహనవిద్యాసాగర, కాకుమాను వేంకటేశ్వర్లు మున్నగువారు ఉపన్యసించారు.

## బాపట్ల

27 న పూర్తిహర్తాళం జరిగినది. గాంధి చౌక్లోని జాతీయపతాకం సగం దించారు.

## కావలి

విద్యార్థికాంగ్రెసువారు 27 సాయంత్రం పెండెం వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతన సభ చేశారు.

## చేబ్రోలు

26 న హర్తాళం జరిగినది. వాసిరెడ్డి అఖిలాండేశ్వరిగారి అధ్యక్షతన సభ జరిగినది.

## కొల్లిపర

యువజన, విద్యార్థి కాంగ్రెసులవారు 27 సాయంత్రం సమావేశమై బోసుగారి కుటుంబాన్ని పరామర్శచేస్తూ తీర్మానించారు. బోసుగారి అనుచరులను విడుదల చేయ గోరారు.

## మోరి

దుకాణాలు మూసివేశారు. విద్యార్థులు పాఠశాలలకు పోలేదు.

## ఒంగోలు

బోసుగారి మృతికి సంతాపసూచకంగా 25 న హర్తాళం జరిగినది.

# గౌతమీ విద్యాపీఠ వార్షికోత్సవం

రాజమండ్రి, ఆగస్టు 27: గౌతమీ విద్యాపీఠ ప్రథమ వార్షికోత్సవము 25 నుండి హిందూ సమాజంలో రాయసం వెంకటశివుడుగారి అధ్యక్షతన జరుగుచున్నది. 30 తేదీన పూర్తగును.

పీఠాధ్యక్షుడు రాజాకాండేసుల శ్రీనివాస జగన్నాథరావు పంతులుగారు పండితులకు స్వాగతంచేశారు. జయపురం మహారాజా, క. యస్. రామస్వామి శాస్త్రి, డాక్టరు పట్టాభి, డాక్టరు వైద్యనాథస్వామి, పిఠాపురం మహారాజా, చెళ్ల కృష్ణమూర్తిశాస్త్రి మున్నగువారి సందేశాలను కార్యదర్శి కాండేసుల జగన్నాథ గోపాలరావు పంతులుగారు చదివారు. సభాధ్యక్షుడు రాయసం వెంకటశివుడుగారు తెలుగు కవిత్వాన్ని గురించి ముచ్చటించారు.

# సన్మానము

గుంటూరు, ఆగస్టు 27: నిన్నసాయంత్రం పురపాలక సంఘమువారు మద్ది వెంకటరంగయ్యగారికి వారి షష్టిపూర్తి సందర్భమున సన్మానం చేశారు. చైర్మన్ తెల్లాకుల జాలయ్యగారు సన్మానపత్రమిచ్చి పూలమాలలు వేశారు.

మద్ది వెంకటరంగయ్యగారు కృతజ్ఞతావాక్యాలు చెప్పి పురపాలక సంఘమువారు హరిజనోద్ధరణకు పూనుకోవలెనన్నారు. హరిజన విద్యార్థులు వసతిగృహంలేక అల్లాడుచున్నారు. ఇపుడు ఈ సందర్భంలో పురసంఘంవారు కృష్ణాశ్రీమాసికి చేస్తున్న సహాయానికి తోడు ఇంకా సాయంచేయాలన్నారు.

రేకపల్లి భాస్కరరావుగారి వందన వాచకంతో సభ ముగిసినది.

# సభలు సమావేశాలకు ఆంక్ష తొలగలేదు

ఏలూరు, ఆగస్టు 28: కాంగ్రెసుసంఘాలపై ఆంక్ష తొలగినా కాంగ్రెసు సంఘాల సమావేశాలు వాటి అభిమానుల సమావేశాలు జరగరాదని లోగడ జిల్లా మేజిస్ట్రేటు జారీచేసిన నిషేధాజ్ఞలు అమలులోనే ఉన్నావని అధికారివర్గాలలో విచారించగా తెలుస్తున్నది.

# నాగలాపురం సంఘటన

మార్కాపురం, ఆగస్టు 27: నాగలాపురం గ్రామంలో స్త్రీలను చెరచబోగా సివిల్ పయనీర్ ఫోర్సువారికిని, ఊరివారికిని ఘర్షణకలిగి ఊరివారు ఫిర్యాదుచేశారు. పోలీసువారు దెబ్బలు తగిలినవారిని అయినసరిని అరెస్టుచేసి యిక్కడికి సబ్జైలుకు తెచ్చారు.

